శ్రీ

శ్రీ కృష్ణాయ నమః.

# ఆంధ్ర శబ్దమంజరి.

## ప్రథమ భాగము.



బహుజనపల్లి సీతారామాచార్యకృతము.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారిచే

ప్రకటితము.

1921

# పీఠిక.

---

భావకు నామములు, సర్వనామములు, క్రియలు, అవ్యయములు అనునవి అంశములుగా నున్నవి. కావున విద్యార్థులు మొట్టమొదట వానిస్వరూపమును లక్షణయుక్తముగా గుర్తెఱుంగుటయే భాషాపరిజ్ఞానమునకు ముఖ్యసాధనము. క్రిందితరగతి బాలురకు అయ్యవి వానిని మాత్రము ప్రత్యేకముగాఁ దెలియఁజేయు నిట్టిపుస్తకములవలననే తెలిసికొనుట సాధ్యముకాని వ్యాకరణ గ్రంథములు ఎంతవిశదములై యుండినను అవిసూత్రరూపములై యుండి బుద్ధి గోచరములు కాకపోవుటచేత ఆ వ్యాకరణగ్రంథములవలనఁ దెలిసికొనుట సాధ్యముకాదు. విషయము అప్పటికిఁ గొంచెము తెలిసినట్లున్నను అది కొంతకాలమునకు మలినమైపోవును. మనసున నానికగా నిలువదు. అట్లు ప్రత్యేకముగా నేర్పడు పుస్తకముల యందును విషయములు తేటగా నున్నయెడ బాలురకది సులభముగా బోధపడునుగాని అట్లు లేనియెడ సులభముగా బోధపడనేరదు. ఈయర్థము విద్యార్థులకు బోధించెడి యుపాధ్యాయులకనుభవవేద్యముగానే యుండును. కాన విషయవిభాగము తేటగా నేర్పఱిచి కాననివారు కాఱడవిఁ జొచ్చినట్లుకాక విషయము కరతలామలకముగ దెలియునట్లు ఇంగ్లీషు వ్యాకరణ సంజ్ఞలతోడ వ్రాయఁబూనుకొన్న యీ పుస్తకమును రెండు భాగములుచేసి మొదటిభాగమునందు సామాన్యపదములను రెండవభాగమునందు విశేషపదములను జేర్చి దీనికి ఆంధ్రశబ్దమంజరి అను పేరిడఁబడియెను. ఈ పుస్తకమును జూచినప్పుడు ఇది యిట్టిదని చూపఱకుఁ దేటతెల్లము కాఁగలదు. విశేష ముగ్గడింపనేల. క్రింది తరగతి బాలురకు ఇదియె తగిన వ్యాకరణమనుటకు ఎంతమాత్రము సందేహ ముండదు. ప్రప్రథమము వ్యాకరణమును జదివి తెలిసికొనఁ దగిన ముఖ్యాంశములగు

పై సూచించిన వాని స్వరూపము లిందుఁ గ్రమముగాఁ దెలుపఁబడియెడి. అందు మొదట నామపదముల స్వరూపములు దెలుపఁబడుచున్నవి.

---

## గ్రంథవిషయ ప్రారంభము.

నామములనఁగా వస్తువాచకశబ్దములు. అవి యీభాషయందు తత్సమ తద్భవ దేశ్య గ్రామ్యభేదములచేత నాలుగువిధములు గలవిగా నున్నవి. అందు గ్రామ్యములకు విభక్తులు మొదలైనవి తెలుపఁబడ బనిలేదు. కానఁ దక్కినవాని రెండుతెగలుచేసి అందు మొదటితెగయైన సంస్కృతసమపదములకు మొదట విభక్తులు లోనగువానిఁ దెలిపి తరువాత మఱియొక తెగయైన అచ్చతెనుఁగు పదములకు విభక్తులులోనగునవి తెలుపఁబడును. సంస్కృతసమములలో ముందు అజంతశబ్దములును వెనుక హలంతశబ్దములును వ్రాయఁబడును. అజంతములనఁగా అచ్చులు అంతమందుఁగలవి, హలంతములనఁగా హల్లులు అంతమందుఁ గలవి. అంతము-చివర. ప్రాకృత సమతద్భవ దేశ్యములు సంస్కృతసమములతోఁ గూడియున్నప్పుడు ఈభాష కేవలము తెనుఁగు అనియు, కూడకున్నప్పుడు అచ్చతెనుఁగు అనియు వ్యవహరింపఁబడును. అయినను ఇందు తెనుఁగన్నప్పుడు అచ్చతెనుఁగు అనియే గ్రహింపవలయును.

అట్టి వస్తువాచక శబ్దములు—. రాముఁడు, హరి, గురుఁడు, రమ, జ్ఞానము; జడ, జముఁడు, గారవము; మరుఁడు, తామర, సారసము; వెన్నుఁడు, అచ్చెర, జన్నము; మగఁడు, మనుమఁడు, అల్లుఁడు, తమ్ముఁడు, చీమ, దోమ, తల్లి, తండ్రి, చెట్టు తెట్టు, వంట, పంట, పల్లము, బెల్లము మొదలగునవి. ఇవియే విశేష్యములనఁబడును. ఇవి మహదర్థకములు అమహదర్థకములు అని ద్వివిధములు. పురుషవాచకశబ్దములు మహదర్థకములు. పశు పక్షి జడ వాచకశబ్దములు అమహదర్థకములు. ఇట్లు చెప్పుటచే మనుష్యస్త్రీవాచక శబ్ద

ములు మహత్యర్థకములనియు, తిర్యక్ స్త్రీవాచకశబ్దములును తదితర స్త్రీలింగశబ్దములును అమహత్యర్థకములనియు నేర్పడుచున్నవి. ఆయావిశేష్యంబులసంజ్ఞలే ఆయాయి విశేషణంబులకు నగు. తద్వివరణము.—రాముఁడు ఇది వస్తువును దెలుపునది విశేష్యము మహదర్థకము. సుగుణాభి రాముఁడు ఇది ఆవస్తువు నందలి గుణమును దెలుపునది విశేషణము కనుక ఇదియు మహదర్థకమే. సీత ఇది వస్తువును దెలుపునది విశేష్యము మహత్యర్థకము. భక్తవత్సల ఇది ఆవస్తువునందలి గుణమును దెలుపునది విశేషణము కనుక ఇదియు మహత్యర్థకమే. జలము ఇది వస్తువును దెలుపునది విశేష్యము అమహదర్థకము. నిర్మలము ఇది ఆవస్తువునందలి గుణమును దెలుపునది కనుక ఇదియు అమహదర్థకమే. కృప ఇది వస్తువును దెలుపునది విశేష్యము అమహత్యర్థకము. సంతాపహారిణి ఇది ఆవస్తువునందలి గుణమును దెలుపునది విశేషణము కనుక ఇదియు అమహత్యర్థకమే. ఇట్లంతట నెఱుంగునది.

---

## అట్టినామములమీఁదవచ్చు విభక్తులు.

---

| విభక్తుల పేళ్లు. | సంకేతములు. | అందువచ్చు వర్ణకములు. |
|---|---|---|
| ౧. ప్రథమా విభక్తి. | ప్ర. (Nominative case.) | డు, ము, వు, లు |
| సంబోధన ప్రథమావిభక్తి. | సం. (Vocative case.) | |
| ౨. ద్వితీయా విభక్తి. | ద్వి. (Accusative case.) | ని, ను, ల |
| ౩. తృతీయా విభక్తి. | తృ. (Instrumental case.) | చేత, చే, తోడ, తో |
| ౪. చతుర్థీ విభక్తి | చ. (Dative case.) | కొఱకు, కయి |
| ౫. పంచమీ విభక్తి. | పం. (Ablative case.) | వలన, కంటె |
| ౬. షష్ఠీవిభక్తి. | ష. (Genitive case.) | కి, కు, యొక్క, లోపల |
| ౭. సప్తమీ విభక్తి. | స. (Locative case.) | అందు, న |

ఇందు డు, ము, వు, ని, ను, న వర్ణకము లేకవచనంబులును, లు, ల, లోపల వర్ణకములు బహువచనంబులు నగు.

---

శ్రీ

# ఆంధ్రశబ్దమంజరి.

---

## ప్రథమభాగము (First Part)

## అజంత సంస్కృత సమనామములు.

SANSKRIT (NOUNS.)

### మహాదర్శకములు.

### రామశబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| *ప్ర. | రాముఁడు | (రాఘవుఁడు.) | రాములు |
| § ద్వి. | రామునిన్, రామున్ | | రాములన్ |
| తృ. | రామునిచేతన్, రాముచేతన్ | | రాములచేతన్ |
| | రామునిచేన్, రాముచేన్ | | రాములచేన్ |
| | రామునితోడన్, రాముతోడన్ | | రాములతోడన్ |
| | రామునితోన్, రాముతోన్ | | రాములతోన్ |

---

* రాముఁడు ఇక్కడ అరసున్న హ్రస్వముమీఁద నున్నదిగాన నిది నిండుసున్నయు నగును. (రాముండు) ఇట్టితరస్థలంబులయందును నెఱుంగ వలయును.

§ రామునిని-రాములను అని ఇత్యాదిస్థలములయందు స్వత్వయుక్తముగానును జెప్పఁగొనవచ్చును. స్వత్వమనఁగా ద్రుతము ఇకార ఉకారములతోఁ జేరియుండుట.

(SANSKRIT NOUNS.)

## మహదర్థకములు.

| | ఏ. | బ. |
|---|---|---|
| చ. | రామునికొఱకున్, రాముకొఱకున్ | రాములకొఱకున్ |
| | రామునికయి, రాముకయి | రాములకయి |
| పం. | రామునివలనన్, రామువలనన్ | రాములవలనన్ |
| | రామునికంటెన్, రాముకంటెన్ | రాములకంటెన్ |
| ష. | రామునకున్, రామునికిన్ | రాములకున్ |
| | రామునియొక్క, రాముయొక్క | రాములయొక్క |
| | | రాములలోపలన్ |
| స. | రామునియందున్ | రాములయందున్ |
| | రామునందున్ | రాములందున్ |
| *సం. | ఓరాముఁడ | ఓరాములార |
| | ఓరాముఁడా | ఓరాములారా |
| | ఓరామ, ఓరామా | ఓరాములు. |

ఇట్లు కృష్ణుఁడు, శివుఁడు, ఇంద్రుఁడు, నృపుఁడు, మనుష్యుఁడు మొదలగునవి.

## బా ల శ బ్ద ము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | బాలుఁడు | (చిన్నవాఁడు) | బాలురు |

* సంబోధింపఁబడు శబ్దము మహదర్థకమైనప్పుడు ఓయి యని చేర్చియుఁ జెప్పవచ్చును. ఓయిరాముఁడ ఇత్యాదులు. ఓ, ఓయి ఇవి చేర్పకయుఁ జెప్పవచ్చును. రాముఁడ, రాముఁడా ఇత్యాదులు. ఇట్లంతట నెఱుంగునది.

(SANSKRIT NOUNS.)

## మహదర్థకములు.

| | ఏ. | బ. |
|---|---|---|
| ద్వి. | బాలునిన్, బాలున్ | బాలురన్ |
| తృ. | బాలునిచేతన్, బాలుచేతన్ | బాలురచేతన్ |
| | బాలునిచేన్, బాలుచేన్ | బాలురచేన్ |
| | బాలునితోడన్, బాలుతోడన్ | బాలురతోడన్ |
| | బాలునితోన్, బాలుతోన్ | బాలురతోన్ |
| చ. | బాలునికొఱకున్, బాలుకొఱకున్ | బాలురకొఱకున్ |
| | బాలునికయి, బాలుకయి | బాలురకయి |
| పం. | బాలునివలనన్, బాలువలనన్ | బాలురవలనన్ |
| | బాలునికంటెన్, బాలుకంటెన్ | బాలురకంటెన్ |
| ష. | బాలునకున్, బాలునికిన్ | బాలురకున్ |
| | బాలునియొక్క, బాలుయొక్క | బాలురయొక్క |
| | | బాలురలోపలన్ |
| స. | బాలునియందున్ | బాలురయందున్ |
| | బాలునందున్ | బాలురందున్ |
| సం. | ఓబాలుఁడ, ఓబాలుఁడా | ఓబాలురార, ఓబాలురారా |
| | ఓబాల, ఓబాలా | ఓబాలురు. |

ఇట్లు నృపాలుఁడు, భూపాలుఁడు, సుశీలుఁడు వెం.

## హరిశబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | హరి | (విష్ణువు) | హరులు |
| ద్వి. | హరినిన్, హరిన్ | | హరులన్ |

# అజంత సంస్కృత సమనామములు.

(SANSKRIT NOUNS.)

## మహాదర్థకములు.

| | ఏ. | బ. |
|---|---|---|
| తృ. | హరిచేతన్, హరిచేన్ | హరులచేతన్, హరులచేన్ |
| | హరితోడన్, హరితోన్ | హరులతోడన్, హరులతోన్ |
| చ. | హరికొఱకున్, హరికయి | హరులకొఱకున్, హరులకయి |
| పం. | హరివలనన్, హరికంటెన్ | హరులవలనన్, హరులకంటెన్ |
| ష. | హరికిన్, హరియొక్క | హరులకున్, హరులయొక్క |
| | | హరులలోపలన్ |
| స. | హరియందున్ | హరులయందున్, హరులందున్ |
| సం. | ఓహరి, ఓహరీ | ఓహరులార, ఓహరులారా |
| | | ఓహరులు. |

ఇట్లు అరి, శౌరి, యతి, పతి, కవి, రవి, గ్రామణి, సేనాని మొ.

## శంభుశబ్దము.

| | ఏ. | బ. |
|---|---|---|
| ప్ర. | శంభువు, శంభుఁడు (శివుఁడు) | శంభువులు, శంభులు |
| ద్వి. | శంభువున్, శంభునిన్, శంభున్ | శంభువులన్, శంభులన్ |
| తృ. | శంభువుచేతన్ | శంభువులచేతన్ |
| | శంభునిచేతన్, శంభుచేతన్ | శంభులచేతన్ |
| | శంభువుచేన్ | శంభువులచేన్ |
| | శంభునిచేన్, శంభుచేన్ | శంభులచేన్ |
| | శంభువుతోడన్ | శంభువులతోడన్ |
| | శంభునితోడన్, శంభుతోడన్ | శంభులతోడన్ |

(SANSKRIT NOUNS.)

## మహాదర్థకములు.

| | ఏ. | బ. |
|---|---|---|
| | శంభువుతోఁ | శంభువులతోఁ |
| | శంభునితోఁ, శంభుతోఁ | శంభులతోఁ |
| చ. | శంభువుకొఱకుఁ | శంభువులకొఱకుఁ |
| | శంభునికొఱకుఁ, శంభుకొఱకుఁ | శంభులకొఱకుఁ |
| | శంభువుకయి | శంభువులకయి |
| | శంభునికయి, శంభుకయి | శంభులకయి |
| పం. | శంభువువలనఁ | శంభువులవలనఁ |
| | శంభునివలనఁ, శంభువలనఁ | శంభులవలనఁ |
| | శంభువుకంటెఁ | శంభువులకంటెఁ |
| | శంభునికంటెఁ, శంభుకంటెఁ | శంభులకంటెఁ |
| ష. | శంభువునకుఁ | శంభువులకుఁ |
| | శంభునకుఁ, శంభునికిఁ | శంభులకుఁ |
| | శంభువుయొక్క | శంభువులయొక్క |
| | శంభునియొక్క, శంభుయొక్క | శంభులయొక్క |
| | | శంభువులలోపలఁ |
| | | శంభులలోపలఁ |
| స. | శంభువునందుఁ | శంభువులయందుఁ |
| | శంభువందుఁ | శంభువులందుఁ |
| | శంభునియందుఁ | శంభులయందుఁ |
| | శంభునందుఁ | శంభులందుఁ |
| సం. | ఓశంభువ | ఓశంభువులార |
| | ఓశంభువా | ఓశంభువులారా |
| | ఓశంభుఁడ | ఓశంభులార |

# అజంత సంస్కృత సమనామములు.

(Sanskrit Nouns.)

## మహదర్థకములు.

| ఏ. | బ. |
|---|---|
| ఓశంభుఁడా | ఓశంభులారా |
| * ఓశంభూ | ఓశంభువులు, ఓశంభులు. |

ఇట్లు విష్ణువు, విధువు, బంధువు మొ.

## మను శబ్దము.

| | ఏ. | బ. |
|---|---|---|
| ప్ర. | మనువు (ఆదిచక్రవర్తి) | మనువులు |
| ద్వి. | మనువున్ | మనువులన్ |
| తృ. | మనువుచేతన్ | మనువులచేతన్ |
| | మనువుచేన్ | మనువులచేన్ |
| | మనువుతోడన్ | మనువులతోడన్ |
| | మనువుతోన్ | మనువులతోన్ |
| చ. | మనువుకొఱకున్ | మనువులకొఱకున్ |
| | మనువుకయి | మనువులకయి |
| పం. | మనువువలనన్ | మనువులవలనన్ |
| | మనువుకంటెన్ | మనువులకంటెన్ |
| ష. | మనువునకున్ | మనువులకున్ |
| | మనువుయొక్క | మనువులయొక్క |
| | | మనువులలోపలన్ |
| స. | మనువునందున్ | మనువులయందున్ |
| | మనువందున్ | మనువులందున్ |

* ఓశంభూ దీనిని ప్లుతోచ్చారణముతోఁ జెప్పవలయును. ప్లుతమనఁగా—మూఁడు హ్రస్వము లుచ్చరించునంత కాలము.

(SANSKRIT NOUNS.)

## మహాదర్శకములు.

| ఏ. | బ. |
|---|---|
| సం. ఓమనువ | ఓమనువులార |
| ఓమనువా | ఓమనువులారా, ఓమనువులు. |

ఇట్లు స్వాయంభువు మొ.

## పితృశబ్దము.

| | ఏ. | బ. |
|---|---|---|
| ప్ర. | పిత (తండ్రి) | పితలు |
| ద్వి. | పితన్ | పితలన్ |
| తృ. | పితచేతన్, పితచేన్ | పితలచేతన్, పితలచేన్ |
| | పితతోడన్, పితతోన్ | పితలతోడన్, పితలతోన్ |
| చ. | పితకొఱకున్, పితకయి | పితలకొఱకున్, పితలకయి |
| పం. | పితవలనన్, పితకంటెన్ | పితలవలనన్, పితలకంటెన్ |
| ష. | పితకున్, పితయొక్క | పితలకున్, పితలయొక్క |
| | | పితలలోపలన్ |
| స. | పితయందున్ | పితలయందున్ పితలందున్ |
| సం. | ఓపిత, ఓపితా | ఓపితలార, ఓపితలారా, ఓపితలు. |

ఇట్లు జామాత, భ్రాత, కర్త, హర్త, గంత, హంత మొ.

## విధాతృశబ్దము.

| | ఏ. | బ. |
|---|---|---|
| ప్ర. | విధాతృఁడు (బ్రహ్మ) | విధాతృలు |
| | విధాత | విధాతలు |
| ద్వి. | విధాతృనిన్, విధాతృన్ | విధాతృలన్ |
| | విధాతన్ | విధాతలన్ |

(SANSKRIT NOUNS.)

## మహాదర్థకములు.

| | ఏ. | బ. |
|---|---|---|
| తృ. | విధాతృనిచేతన్, విధాతృచేతన్ | విధాతృలచేతన్ |
| | విధాతచేతన్ | విధాతలచేతన్ |
| | విధాతృనిచేన్, విధాతృచేన్ | విధాతృలచేన్ |
| | విధాతచేన్ | విధాతలచేన్ |
| | విధాతృనితోడన్, విధాతృతోడన్ | విధాతృలతోడన్ |
| | విధాతతోడన్ | విధాతలతోడన్ |
| | విధాతృనితోడన్, విధాతృతోన్ | విధాతృలతోన్ |
| | విధాతతోన్ | విధాతలతోన్ |
| చ. | విధాతృనికొఱకున్, విధాతృకొఱకున్ | విధాతృలకొఱకున్ |
| | విధాతకొఱకున్ | విధాతలకొఱకున్ |
| | విధాతృనికయి, విధాతృకయి | విధాతృలకయి |
| | విధాతకయి | విధాతలకయి |
| పం. | విధాతృనివలనన్, విధాతృవలనన్ | విధాతృలవలనన్ |
| | విధాతవలనన్ | విధాతలవలనన్ |
| | విధాతృనికంటెన్, విధాతృకంటెన్ | విధాతృలకంటెన్ |
| | విధాతకంటెన్ | విధాతలకంటెన్ |
| ష. | విధాతృనకున్, విధాతృనికిన్ | విధాతృలకున్ |
| | విధాతకున్ | విధాతలకున్ |
| | విధాతృనియొక్క, విధాతృయొక్క | విధాతృలయొక్క |
| | విధాతయొక్క | విధాతలయొక్క |
| | | విధాతృలలోపలన్ |
| | | విధాతలలోపలన్ |

(Sanskrit Nouns.)

## మహదర్థకములు.

| | ఏ. | బ. |
|---|---|---|
| స. | విధాతృనియందున్, విధాతృనందున్ | విధాతృలయందున్ |
| | | విధాతృలందున్ |
| | విధాతయందున్ | విధాతలయందున్ |
| | | విధాతలందున్ |
| సం. | ఓవిధాతృఁడ, ఓవిధాతృఁడా | ఓవిధాతృలార |
| | | ఓవిధాతృలారా |
| | ఓవిధాత, ఓవిధాతా | ఓవిధాతలార |
| | | ఓవిధాతలారా |
| | | ఓవిధాతృలు |
| | | ఓవిధాతలు. |

ఇట్లు దాతృఁడు, ధాతృఁడు, నేతృఁడు, సవితృఁడు మొ.

## మహత్యర్థకములు.

### ర మా శ బ్ద ము.

| | ఏ. | బ. |
|---|---|---|
| ప్ర. | రమ (లక్ష్మి) | రమలు |
| ద్వి. | రమన్ | రమలన్ |
| తృ. | రమచేతన్, రమచేన్ | రమలచేతన్, రమలచేన్ |
| | రమతోడన్, రమతోన్ | రమలతోడన్, రమలతోన్ |
| చ. | రమకొఱకున్, రమకయి | రమలకొఱకున్, రమలకయి |
| పం. | రమవలనన్, రమకంటెన్ | రమలవలనన్, రమలకంటెన్ |
| ష. | రమకున్, రమయొక్క | రమలకున్, రమలయొక్క |
| | | రమలలోపలన్ |

(SANSKRIT NOUNS.)

## మహాత్వార్థకములు.

| ఏ. | బ. |
|---|---|
| స. రమయందుఁ | రమలయందుఁ, రమలందుఁ |
| సం. ఓరమ, ఓరమా | ఓరమలార, ఓరమలారా, ఓరమలు. |

ఇట్లు అంబ, సీత, భామ, వనిత, కద్రువ, దేవత, పద్మనేత్ర మొ.

## యువతిశబ్దము.

| | ఏ. | బ. |
|---|---|---|
| ప్ర. | యువతి (యౌవనముగల ఆఁడుది) | యువతులు |
| ద్వి. | యువతిఁ | యువతులఁ |
| తృ. | యువతిచేతఁ | యువతులచేతఁ |
| | యువతిచేఁ | యువతులచేఁ |
| | యువతితోడఁ | యువతులతోడఁ |
| | యువతితోఁ | యువతులతోఁ |
| చ. | యువతికొఱకుఁ | యువతులకొఱకుఁ |
| | యువతికయి | యువతులకయి |
| పం. | యువతివలనఁ | యువతులవలనఁ |
| | యువతికంటెఁ | యువతులకంటెఁ |
| ష. | యువతికిఁ | యువతులకుఁ |
| | యువతియొక్క | యువతులయొక్క |
| | | యువతులలోపలఁ |
| స. | యువతియందుఁ | యువతులయందుఁ |
| | | యువతులందుఁ |

(SANSKRIT NOUNS.)

## మహాత్త్వార్థకములు.

| | ఏ. | బ. |
|---|---|---|
| సం. | ఓయువతి, ఓయువతీ | ఓయువతులార<br>ఓయువతులారా<br>ఓయువతులు. |

ఇట్లు గౌరి, వాణి, కర్త్రి, గుణవతి, పద్మముఖి, భాగ్యశాలిని మొ.

### సుతనుశబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | సుతనువు | (మంచిదేహము గలస్త్రీ) | సుతనువులు |
| ద్వి. | సుతనువున్ | | సుతనువులన్ |
| తృ. | సుతనువుచేతన్ మొ. | | సుతనువులచేతన్ మొ. |

శేషంబు మనుశబ్దంబునకువలె.

ఇట్లు వధువు, సుభ్రువు మొ.

## అమహదర్థకములు.

### జ్ఞానశబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | జ్ఞానము<br>జ్ఞానమ్ము<br>జ్ఞానంబు | (తెలివి) | జ్ఞానములు<br>జ్ఞానమ్ములు<br>జ్ఞానంబులు |
| ద్వి. | జ్ఞానమున్<br>జ్ఞానమ్మున్<br>జ్ఞానంబున్ | | జ్ఞానములన్<br>జ్ఞానమ్ములన్<br>జ్ఞానంబులన్ |

(Sanskrit Nouns.)

## అమహదర్థకములు.

| | ఏ. | బ. |
|---|---|---|
| తృ. | జ్ఞానముచేతన్ | జ్ఞానములచేతన్ |
| | జ్ఞానమ్ముచేతన్ | జ్ఞానమ్ములచేతన్ |
| | జ్ఞానంబుచేతన్ | జ్ఞానంబులచేతన్ |
| | జ్ఞానముచేన్ | జ్ఞానములచేన్ |
| | జ్ఞానమ్ముచేన్ | జ్ఞానమ్ములచేన్ |
| | జ్ఞానంబుచేన్ | జ్ఞానంబులచేన్ |
| | జ్ఞానముతోడన్ | జ్ఞానములతోడన్ |
| | జ్ఞానమ్ముతోడన్ | జ్ఞానమ్ములతోడన్ |
| | జ్ఞానంబుతోడన్ | జ్ఞానంబులతోడన్ |
| | జ్ఞానముతోన్ | జ్ఞానములతోన్ |
| | జ్ఞానమ్ముతోన్ | జ్ఞానమ్ములతోన్ |
| | జ్ఞానంబుతోన్ | జ్ఞానంబులతోన్ |
| చ. | జ్ఞానముకొఱకున్ | జ్ఞానములకొఱకున్ |
| | జ్ఞానమ్ముకొఱకున్ | జ్ఞానమ్ములకొఱకున్ |
| | జ్ఞానంబుకొఱకున్ | జ్ఞానంబులకొఱకున్ |
| | జ్ఞానముకయి | జ్ఞానములకయి |
| | జ్ఞానమ్ముకయి | జ్ఞానమ్ములకయి |
| | జ్ఞానంబుకయి | జ్ఞానంబులకయి |
| పం. | జ్ఞానమువలనన్ | జ్ఞానములవలనన్ |
| | జ్ఞానమ్మువలనన్ | జ్ఞానమ్ములవలనన్ |
| | జ్ఞానంబువలనన్ | జ్ఞానంబులవలనన్ |
| | జ్ఞానముకంటెన్ | జ్ఞానములకంటెన్ |

(SANSKRIT NOUNS.)

## అమహదర్థకములు.

| | ఏ. | బ. |
|---|---|---|
| | జ్ఞానముఁకంటెన్ | జ్ఞానముఁలకంటెన్ |
| | జ్ఞానంబుకంటెన్ | జ్ఞానంబులకంటెన్ |
| ష. | జ్ఞానమునకున్ | జ్ఞానములకున్ |
| | జ్ఞానముఁనకున్ | జ్ఞానముఁలకున్ |
| | జ్ఞానంబునకున్ | జ్ఞానంబులకున్ |
| | జ్ఞానముయొక్క | జ్ఞానములయొక్క |
| | జ్ఞానముఁయొక్క | జ్ఞానముఁలయొక్క |
| | జ్ఞానంబుయొక్క | జ్ఞానంబులయొక్క |
| | | జ్ఞానములలోపలన్ |
| | | జ్ఞానముఁలలోపలన్ |
| | | జ్ఞానంబులలోపలన్ |
| స. | జ్ఞానమునందున్ | జ్ఞానములయందున్ |
| | జ్ఞానమందున్ | జ్ఞానములందున్ |
| | జ్ఞానముఁనందున్ | జ్ఞానముఁలయందున్ |
| | జ్ఞానముఁందున్ | జ్ఞానముఁలందున్ |
| | జ్ఞానంబునందున్ | జ్ఞానంబులయందున్ |
| | జ్ఞానంబందున్ | జ్ఞానంబులందున్ |
| | జ్ఞానమునన్ | |
| | జ్ఞానముఁనన్ | |
| | జ్ఞానంబునన్ | |
| సం. | ఓ జ్ఞానము | ఓ జ్ఞానములార |
| | ఓ జ్ఞానమా | ఓ జ్ఞానములారా |

(Sanskrit Nouns.)

## అమహదర్థకములు.

| ఏ. | బ. |
|---|---|
| ఓజ్ఞానమ | ఓజ్ఞానములార |
| ఓజ్ఞానమా | ఓజ్ఞానములారా |
| ఓజ్ఞానంబ | ఓజ్ఞానంబులార |
| ఓజ్ఞానంబా | ఓజ్ఞానంబులారా |
| | ఓజ్ఞానములు |
| | ఓజ్ఞానములు |
| | ఓజ్ఞానంబులు. |

ఇట్లు ధనము, వనము, పర్వతము, వృక్షము మొ.

## గిరిశబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | గిరి | (కొండ) | గిరులు |
| ద్వి. | గిరిన్ | | గిరులన్ |
| తృ. | గిరిచేతన్ మొ. | | గిరులచేతన్ మొ. |

శేషంబు హరిశబ్దంబునకువలె.

ఇట్లు వారి, శుచి మొ.

## తరుశబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | తరువు | (చెట్టు) | తరువులు, తరులు |
| ద్వి. | తరువున్, తరున్ | | తరువులన్, తరులన్ |
| తృ. | తరువుచేతన్, తరుచేతన్ | | తరువులచేతన్, తరులచేతన్ |
| | తరువుచేన్, తరుచేన్ | | తరువులచేన్, తరులచేన్ |

(SANSKRIT NOUNS.)

## అనుహాదర్శకములు.

| ఏ. | బ. |
|---|---|
| తరువుతోడన్, తరుతోడన్ | తరువులతోడన్, తరులతోడన్ |
| తరువుతోన్, తరుతోన్ | తరువులతోన్, తరులతోన్ |
| చ. తరువుకొఱకున్ | తరువులకొఱకున్ |
| తరుకొఱకున్ | తరులకొఱకున్ |
| తరువుకయి, తరుకయి | తరువులకయి, తరులకయి |
| పం. తరువువలనన్, తరువలనన్ | తరువులవలనన్, తరులవలనన్ |
| తరువుకంటెన్ | తరువులకంటెన్ |
| తరుకంటెన్ | తరులకంటెన్ |
| ష. తరువునకున్, తరునకున్ | తరువులకున్, తరులకున్ |
| తరువుయొక్క, తరుయొక్క | తరువులయొక్క, తరులయొక్క |
| | తరువులలోపలన్, తరులలోపలన్ |
| స. తరువునందున్, తరువందున్ | తరువులయందున్, తరువులందున్ |
| తరునందున్ | తరులయందున్, తరులందున్ |
| సం. ఓతరువ, ఓతరువా | ఓతరువులార, ఓతరువులారా |
| | ఓతరులార, ఓతరులారా |
| | ఓతరువులు, ఓతరులు. |

ఇటు చరువు మొ.

## గో శబ్దము.

| ఏ. | | బ. |
|---|---|---|
| ప్ర. గోవు | (ఎద్దు) | గోవులు |
| ద్వి. గోవున్ | | గోవులన్ |
| తృ. గోవుచేతన్ మొ. | | గోవులచేతన్ మొ. |

శేషంబు మనుశబ్దంబునకువలె.

(SANSKRIT NOUNS.)

## అనుహాత్యర్థకములు.

### విద్యాశబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | విద్య | (చదువు) | విద్యలు |
| ద్వి. | విద్యను | | విద్యలను |
| తృ. | విద్యచేతను, విద్యచేను మొ. | | విద్యలచేతను, విద్యలచేను మొ. |

శేషంబు రమాశబ్దమునకు వలె.

ఇట్లు క్షమ, లత, నావ, ఘనత మొ.

### మతిశబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | మతి | (బుద్ధి) | మతులు |
| ద్వి. | మతిని | | మతులను |
| తృ. | మతిచేతను, మతిచేను మొ. | | మతులచేతను, మతులచేను మొ. |

శేషంబు యువతిశబ్దంబునకు వలె.

ఇట్లు గతి, హాని, నది, హృది, దివి, భువి మొ.

### ధేనుశబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | ధేనువు | (ఆవు) | ధేనువులు, ధేనులు |
| ద్వి. | ధేనువును, ధేనును | | ధేనువులను, ధేనులను. |

శేషంబు తరుశబ్దమునకు వలె.

ఇట్లు తనువు మొ.

(SANSKRIT NOUNS.)

## మహాదర్శకములు.

### మ రు త్ శ బ్ద ము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | మరుత్తు | (వాయువు) | మరుత్తులు |
| ద్వి. | మరుత్తును | | మరుత్తులను |
| తృ. | మరుత్తుచేతను, మరుత్తుచేను | | మరుత్తులచేతను, మరుత్తులచేను |
| | మరుత్తుతోడను | | మరుత్తులతోడను |
| | మరుత్తుతోను | | మరుత్తులతోను |
| చ. | మరుత్తుకొఱకును | | మరుత్తులకొఱకును |
| | మరుత్తుకయి | | మరుత్తులకయి |
| పం. | మరుత్తువలనను | | మరుత్తులవలనను |
| | మరుత్తుకంటెను | | మరుత్తులకంటెను |
| ష. | మరుత్తునకును | | మరుత్తులకును |
| | మరుత్తుయొక్క | | మరుత్తులయొక్క |
| | | | మరుత్తులలోపలను |
| స. | మరుత్తునందును | | మరుత్తులయందును |
| | | | మరుత్తులందును |
| సం. | ఓ మరుత్త, ఓమరుత్తా | | ఓమరుత్తులార, ఓమరుత్తులారా |
| | | | ఓమరుత్తులు. |

ఇట్లు ఇంద్రజిత్తు మొ.

### బ్ర హ్మ న్ శ బ్ద ము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | బ్రహ్మ | (సృష్టికర్త) | బ్రహ్మలు |
| ద్వి. | బ్రహ్మను | | బ్రహ్మలను |

(SANSKRIT NOUNS.)

## మహదర్థకములు.

| | ఏ. | బ. |
|---|---|---|
| తృ. | బ్రహ్మచేతన్, బ్రహ్మచేన్ మొ. | బ్రహ్మలచేతన్, బ్రహ్మలచేన్ మొ. |

శేషంబు పితృశబ్దమునకు వలె.

ఇట్లు అశ్వత్థామ, కృష్ణవర్త్మ, యజ్వ, యువ మొ.

## ఆత్మన్ శబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | ఆత్మ | (జీవుఁడు) | ఆత్మలు |
| | ఆత్మము, ఆత్మమ్ము | | ఆత్మములు, ఆత్మమ్ములు |
| | ఆత్మంబు | | ఆత్మంబులు |
| | ఆత్ముఁడు | | ఆత్ములు |
| ద్వి. | ఆత్మన్ | | ఆత్మలన్ |
| | ఆత్మమున్, ఆత్మమ్మున్ | | ఆత్మములన్, ఆత్మమ్ములన్ |
| | ఆత్మంబున్ | | ఆత్మంబులన్ |
| | ఆత్మునిన్, ఆత్మున్ | | ఆత్ములన్ |
| తృ. | ఆత్మచేతన్ | | ఆత్మలచేతన్ |
| | ఆత్మముచేతన్ | | ఆత్మములచేతన్ |
| | ఆత్మునిచేతన్ మొ. | | ఆత్ములచేతన్ మొ. |

శేషం బూహ్యంబు.

## గుణిన్ శబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | గుణి | (గుణవంతుఁడు) | గుణులు |
| ద్వి. | గుణినిన్, గుణిన్ | | గుణులన్ |

(SANSKRIT NOUNS.)

మహాదర్థకములు.

| ఏ. | బ. |
| --- | --- |
| తృ. గుణిచేతన్ మొ. | గుణులచేతన్ మొం. |

శేషం బూహ్యాంబు.

ఇట్లు ధని, తేజస్వి, యశస్వి మొం.

## ఋత్విక్ శబ్దము.

| ఏ. | బ. |
| --- | --- |
| ప్ర. ఋత్విజుఁడు (యజ్ఞము చేయించువాఁడు) | ఋత్విజులు |
| ఋత్విక్కు | ఋత్విక్కులు |
| ద్వి. ఋత్విజునిన్, ఋత్విజున్ | ఋత్విజులన్ |
| ఋత్విక్కున్ | ఋత్విక్కులన్ |
| తృ. ఋత్విజునిచేతన్, ఋత్విజుచేతన్ | ఋత్విజులచేతన్ |
| ఋత్విక్కుచేతన్ మొం. | ఋత్విక్కులచేతన్ మొం. |

శేషం బూహ్యాంబు.

ఇట్లు వణిజుఁడు మొ.

## గుణవత్ శబ్దము.

| ఏ. | బ. |
| --- | --- |
| ప్ర. గుణవంతుఁడు | గుణవంతులు |
| ద్వి. గుణవంతునిన్, గుణవంతున్ | గుణవంతులన్ |
| తృ. గుణవంతునిచేతన్ మొం. | గుణవంతులచేతన్ మొం. |

శేషంబు రామశబ్దంబునకు వలె.

ఇట్లు ధనవంతుఁడు, బుద్ధిమంతుఁడు మొం.

(SANSKRIT NOUNS)

## మహదర్థకములు.

### విద్వత్ శబ్దము.

| | ఏ. | బ. |
|---|---|---|
| ప్ర. | విద్వాంసుఁడు (చదువరి) | విద్వాంసులు |
| ద్వి. | విద్వాంసునిఁ, విద్వాంసుఁ | విద్వాంసులఁ |
| తృ. | విద్వాంసునిచేతఁ మొ. | విద్వాంసులచేతఁ మొ. |

శేషం బూహ్యంబు.

## అమహదర్థకములు.

### జగత్ శబ్దము.

| | ఏ. | బ. |
|---|---|---|
| ప్ర. | జగత్తు (లోకము) | జగత్తులు |
| | జగము, జగమ్ము | జగములు, జగమ్ములు |
| | జగంబు | జగంబులు |
| ద్వి. | జగత్తుఁ | జగత్తులఁ |
| | జగముఁ, జగమ్ముఁ | జగములఁ, జగమ్ములఁ |
| | జగంబుఁ | జగంబులఁ |
| తృ. | జగత్తుచేతఁ | జగత్తులచేతఁ |
| | జగముచేతఁ మొ. | జగములచేతఁ మొ. |
| స. | జగత్తునందుఁ | జగత్తులయందుఁ |
| | జగమునందుఁ, జగమునఁ మొ. | జగములయందుఁ మొ. |

శేషం బూహ్యంబు.

(Sanskrit Nouns.)

## అమహదర్థకములు.

### నా మ న్ శ బ్ద ము.

| ఏ. | | బ. |
|---|---|---|
| ప్ర. నామము, నామమ్ము నామంబు | (పేరు) | నామములు, నామమ్ములు నామంబులు |
| ద్వి. నామమున్, నామమ్మున్ నామంబున్ | | నామములన్, నామమ్ములన్ నామంబులన్ |
| తృ. నామముచేతన్ మొ. | | నామములచేతన్ మొ. |

దీనికి జ్ఞానశబ్దమునకువలె రూపంబులు.

ఇట్లు కర్మము, చర్మము, మర్మము, వర్మము మొ.

### క రి న్ శ బ్ద ము.

| ఏ. | | బ. |
|---|---|---|
| ప్ర. కరి | (ఏనుఁగు) | కరులు |
| ద్వి. కరిన్ | | కరులన్ |
| తృ. కరిచేతన్, కరిచేన్ మొ. | | కరులచేతన్, కరులచేన్ మొ. |

శేషంబు గిరిశబ్దమునకు వలె.

ఇట్లు కేసరి మొ.

### వ య స్ శ బ్ద ము.

| ఏ. | | బ. |
|---|---|---|
| ప్ర. వయస్సు, వయసు | (ప్రాయము) | వయస్సులు, వయసులు |
| ద్వి. వయస్సు, వయసున్ | | వయస్సులన్, వయసులన్ |
| తృ. వయస్సుచేతన్ వయసుచేతన్ మొ. | | వయస్సులచేతన్ వయసులచేతన్ మొ. |

శేషం బూహ్యంబు.

# హలంత సంస్కృత సమనామములు.

(Sanskrit Nouns.)

## అమహదర్థకములు.

### ఆయుస్ శబ్దము.

ఏ. — (జీవితకాలము) — బ.

ప్ర. ఆయుస్సు, ఆయువు — ఆయుస్సులు, ఆయువులు

ద్వి. ఆయుస్సున్, ఆయువున్ — ఆయుస్సులన్, ఆయువులన్

తృ. ఆయుస్సుచేతన్, ఆయువుచేతన్ ౛ు. — ఆయుస్సులచేతన్, ఆయువుల చేతన్ ౛ు.

శేషం బూర్వాంబు.

ఇట్లు ధనస్సు ౛ు.

### శ్వన్ శబ్దము.

ఏ. — (కుక్క) — బ.

ప్ర. శ్వానము, శ్వానమ్ము, శ్వానంబు — శ్వానములు, శ్వానమ్ములు, శ్వానంబులు

ద్వి. శ్వానమున్, శ్వానమ్మున్, శ్వానంబున్ — శ్వానములన్, శ్వానమ్ములన్, శ్వానంబులన్

తృ. శ్వానముచేతన్ ౛ు. — శ్వానములచేతన్ ౛ు.

శేషం బూర్వాంబు.

## అమహత్త్వర్థకములు.

### వాక్ శబ్దము.

ఏ. — (నోరు) — బ.

ప్ర. వాక్కు, వాకు — వాక్కులు, వాకులు

(SANSKRIT NOUNS.)

## అమహత్వర్థకములు.

| | ఏ. | బ. |
|---|---|---|
| ద్వి. | వాక్కున్, వాకున్ | వాక్కులన్, వాకులన్ |
| తృ. | వాక్కుచేతన్ | వాక్కులచేతన్ |
| | వాకుచేతన్ ఇం. | వాకులచేతన్ ఇం. |

శేషం బూహ్యంబు.

## ముత్ శబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | ముదము, ముదమ్ము | (సంతోషము) | ముదములు, ముదమ్ములు |
| | ముదంబు | | ముదంబులు |
| ద్వి. | ముదమున్, ముదమ్మున్ | | ముదములన్, ముదమ్ములన్ |
| | ముదంబున్ | | ముదంబులన్ |
| తృ. | ముదముచేతన్ ఇం. | | ముదములచేతన్ ఇం. |

శేషం బూహ్యంబు.

## దిక్ శబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | దిక్కు | (దెస) | దిక్కులు |
| ద్వి. | దిక్కున్ | | దిక్కులన్ |
| తృ. | దిక్కుచేతన్ ఇం. | | దిక్కులచేతన్ ఇం. |

శేషం బూహ్యంబు.

ఇట్లు దృక్కు ఇం.

(TELUGU NOUNS.)

## మహదర్థకములు.

### అబ్బ శబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | అబ్బ | (తండ్రి) | అబ్బలు |
| ద్వి. | అబ్బను | | అబ్బలను |
| తృ. | అబ్బచేతను మొ. | | అబ్బలచేతను మొ. |

శేషంబు పితృశబ్దంబునకు వలె.

ఇట్లు అన్న, అయ్య, దొర, దొంగ, బావ, మామ మొ.

### మగ శబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | మగఁడు | (పెనిమిటి) | మగలు |
| ద్వి. | మగనిని | | మగలను |
| తృ. | మగనిచేతను, మగనిచేన్ | | మగలచేతను, మగలచేన్ |
| | మగనితోడను, మగనితోన్ | | మగలతోడను, మగలతోన్ |
| చ. | మగనికొఱకును | | మగలకొఱకును, మగలకయి |
| పం. | మగనివలనను, మగనికంటెను | | మగలవలనను, మగలకంటెను |
| ష. | మగనికిన్, మగనియొక్క | | మగలకున్, మగలయొక్క |
| | | | మగలలోపలన్ |
| స. | మగనియందున్ | | మగలయందున్, మగలందున్ |
| సం. | ఓ మగఁడ, ఓ మగఁడా | | ఓ మగలార, ఓ మగలారా |
| | | | ఓ మగలు. |

ఇట్లు మనుమఁడు, బాపఁడు, రాయఁడు మొ.

(TELUGU NOUNS.)

## మహాదర్థకములు.

### తండ్రి శబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | తండ్రి | (కన్నవాఁడు) | తండ్రులు |
| ద్వి. | తండ్రినిన్, తండ్రిన్ | | తండ్రులన్ |
| తృ. | తండ్రిచేతన్ మొ. | | తండ్రులచేతన్ మొ. |

శేషంబు హరిశబ్దంబునకు వలె.

ఇట్లు పెనిమిటి, మఱఁది, చదువరి, ముక్కఁడి, కడగండ్లమారి మొ.

### కొడుకు శబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | కొడుకు | (పుత్త్రుఁడు) | కొడుకులు |
| ద్వి. | కొడుకున్ | | కొడుకులన్ |
| తృ. | కొడుకుచేతన్ | | కొడుకులచేతన్ |
| | కొడుకుచేన్ | | కొడుకులచేన్ |
| | కొడుకుతోడన్ | | కొడుకులతోడన్ |
| | కొడుకుతోన్ | | కొడుకులతోన్ |
| ష. | కొడుకునకున్ | | కొడుకులకున్ |
| | కొడుకుయొక్క | | కొడుకులయొక్క |
| | | | కొడుకులలోపలన్ |
| స. | కొడుకునందున్ | | కొడుకులయందున్, కొడుకులందున్ |
| సం. | ఓకొడుక, ఓకొడుకా | | ఓకొడుకులార, ఓకొడుకులారా |
| | | | ఓకొడుకులు. |

శేషం బూహ్యంబు.

ఇట్లు రాజు, జోదు, సైదోడు, రౌతు, తిండిపోతు, రావు మొ.

(TELUGU NOUNS.)

## మహాదర్థకములు.

### తమ్ముఁడు శబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | తమ్ముఁడు | (వెనుకఁ బుట్టినవాఁడు) | తమ్ములు |
| ద్వి. | తమ్మునిన్, తమ్మున్ | | తమ్ములన్ |
| తృ. | తమ్మునిచేతన్, తమ్ముచేతన్ మొ. | | తమ్ములచేతన్ మొ. |
| సం. | ఓతమ్ముఁడ, ఓతమ్ముఁడా | | ఓతమ్ములార, ఓతమ్ములారా ఓతమ్ములు. |

శేషంబు రామశబ్దంబునకు వలె.

ఇట్లు చందురుఁడు, జముఁడు, మరుఁడు మొ.

### అల్లుఁడు శబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | అల్లుఁడు | (కూఁతుమగఁడు) | అల్లురు |
| ద్వి. | అల్లునిన్, అల్లున్ | | అల్లురన్ |
| తృ. | అల్లునిచేతన్, అల్లుచేతన్ మొ. | | అల్లురచేతన్ మొ. |
| సం. | ఓఅల్లుఁడ, ఓఅల్లుఁడా | | ఓఅల్లురార, ఓఅల్లురారా ఓఅల్లురు. |

శేషంబు బాలశబ్దంబునకు వలె.

ఇట్లు నెయ్యుఁడు, పగతుఁడు, మార్తుఁడు మొ.

### అగసాలె శబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | అగసాలె | (బంగారుపనివాఁడు) | అగసాలెలు |
| ద్వి. | అగసాలెన్ | | అగసాలెలన్ |
| తృ. | అగసాలెచేతన్ మొ. | | అగసాలెలచేతన్ మొ. |

(TELUGU NOUNS.)

## మహదర్థకములు.

| | ఏ. | బ. |
|---|---|---|
| సం. | ఓ అగసాలె | ఓ అగసాలెలార |
| | ఓ అగసాలే | ఓ అగసాలెలారా |
| | | ఓ అగసాలెలు. |

శేషం బూహ్యంబు.

ఇట్లు దేవె మొ.

## మహత్యర్థకములు.

### అమ్మ శబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | అమ్మ | (తల్లి) | అమ్మలు |
| ద్వి. | అమ్మను | | అమ్మలను |
| తృ. | అమ్మచేతను మొ. | | అమ్మలచేతను మొ. |

దీనికి రమాశబ్దంబునకువలె రూపంబులు.

ఇట్లు అత్త, అవ్వ, చాన, లేమ, నెలఁతుక, పొలఁతుక, చాకిత, బోయత మొ.

### తల్లి శబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | తల్లి | (కన్నది) | తల్లులు |
| ద్వి. | తల్లిని | | తల్లులను |
| తృ. | తల్లిచేతను మొ. | | తల్లులచేతను మొ. |

దీనికి యువతిశబ్దంబునకు వలె రూపంబులు.

ఇట్లు ఇంతి, చెలి, లచ్చి, సిరి, తొయ్యలి, వెలఁది, కులుకులాఁడి మొ.

(TELUGU NOUNS)

## మహత్త్వార్థకములు.

### అన్న శబ్దము.

| | ఏ. | బ. |
|---|---|---|
| ప్ర. | అన్న (స్త్రీ) | అన్నలు |
| ద్వి. | అన్నన్ | అన్నలన్ |
| తృ. | అన్నచేతన్, అన్నచేన్<br>అన్నతోడన్, అన్నతోన్ | అన్నలచేతన్, అన్నలచేన్<br>అన్నలతోడన్, అన్నలతోన్ |
| ష. | అన్నకున్, అన్నయొక్క | అన్నలకున్, అన్నలయొక్క<br>అన్నలలోపలన్ |
| స. | అన్ననందున్ | అన్నలయందున్, అన్నలందున్ |
| సం. | ఓఅన్న, ఓఅన్నా | ఓ అన్నలార, ఓ అన్నలారా<br>ఓ అన్నలు. |

శేషం బూహ్యంబు.

### కూఁతు శబ్దము.

| | ఏ. | బ. |
|---|---|---|
| ప్ర. | కూఁతురు (పుత్త్రిక) | కూఁతులు |
| ద్వి. | కూఁతున్ | కూఁతులన్ |
| తృ. | కూఁతుచేతన్<br>కూఁతుచేన్<br>కూఁతుతోడన్<br>కూఁతుతోన్ | కూఁతులచేతన్<br>కూఁతులచేన్<br>కూఁతులతోడన్<br>కూఁతులతోన్ |
| ష. | కూఁతునకున్<br>కూఁతుయొక్క | కూఁతులకున్<br>కూఁతులయొక్క<br>కూఁతులలోపలన్ |

(TELUGU NOUNS.)

మహాత్వర్థకములు.

| ఏ. | | బ. |
|---|---|---|
| స. | కూఁతునందుఁ | కూఁతులయందుఁ |
| | | కూఁతులందుఁ |
| సం. | ఓకూఁతుర, ఓకూఁతురా | ఓకూఁతులార, ఓకూఁతులారా |
| | | ఓకూఁతులు. |

శేషం బూహ్యంబు.

కన్నె శబ్దము.

| ఏ. | | బ. |
|---|---|---|
| ప్ర. | కన్నె, కన్నియ (కన్యక) | కన్నెలు, కన్నియలు |
| ద్వి. | కన్నెఁ, కన్నియఁ | కన్నెలఁ, కన్నియలఁ |
| ష. | కన్నెకుఁ, కన్నియకుఁ | కన్నెలకుఁ, కన్నియలకుఁ |
| | కన్నెయొక్క | కన్నెలయొక్క |
| | కన్నియయొక్క | కన్నియలయొక్క |
| | | కన్నెలలోపలఁ |
| | | కన్నియలలోపలఁ |
| సం. | ఓకన్నె, ఓకన్నే | ఓకన్నెలార, ఓకన్నెలారా |
| | ఓకన్నియ, ఓకన్నియా | ఓకన్నియలార, ఓకన్నియలారా |
| | | ఓకన్నెలు, ఓకన్నియలు. |

శేషం బూహ్యంబు.

ఇట్లు వదినె మొ.

(TELUGU NOUNS.)

## అమహదర్థకములు.

### మొక్క శబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | మొక్క | (మొలక) | మొక్కలు |
| ద్వి. | మొక్కన్ | | మొక్కలన్ |
| తృ. | మొక్కచేతన్ మొ. | | మొక్కలచేతన్ మొ. |

శేషంబు రమాశబ్దంబునకువలె.

ఇట్లు కొమ్మ, నిమ్మ, కలఁక, పలక, తెల్లన, నల్లన మొ.

### గది శబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | గది | (అఱ) | గదులు |
| ద్వి. | గదిన్ | | గదులన్ |
| తృ. | గదిచేతన్ మొ. | | గదులచేతన్ మొ. |

శేషంబు గిరిశబ్దంబునకు వలె.

ఇట్లు జిగి, బిగి, పది, వడి, నెమ్మది, తొమ్మిది మొ.

### పలుకు శబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | పలుకు | (మాట) | పలుకులు |
| ద్వి. | పలుకున్ | | పలుకులన్ |
| సం. | ఓపలుక, ఓపలుకా | | ఓపలుకులార, ఓపలుకులారా ఓపలుకులు. |

శేషం బూహ్యంబు.

ఇట్లు తళుకు, బెళుకు; మఱుఁగు, మెఱుఁగు; అరుదు, బిరుదు, తెలుపు, నలుపు మొ.

(TELUGU NOUNS.)

## అమహదర్థకములు.

### తిన్నె శబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | తిన్నె, తిన్నియ | (అరఁగు) | తిన్నెలు, తిన్నియలు |
| ద్వి. | తిన్నెన్, తిన్నియన్ | | తిన్నెలన్, తిన్నియలన్ |
| తృ. | తిన్నెచేతన్ | | తిన్నెలచేతన్ |
| | తిన్నియచేతన్ మొ. | | తిన్నియలచేతన్ మొ. |

శేషంబు కన్నెశబ్దంబునకు వలె.

ఇట్లు గుదె, గిన్నె, వన్నె మొ.

### కళ్లము శబ్దము.

| | ఏ. | బ. |
|---|---|---|
| ప్ర. | కళ్లము (ధాన్యము నుఱుచుచోటు) | కళ్లములు |
| | కళ్లమ్ము | కళ్లమ్ములు |
| | కళ్లంబు | కళ్లంబులు |
| ద్వి. | కళ్లమున్ | కళ్లములన్ |
| | కళ్లమ్మున్ | కళ్లమ్ములన్ |
| | కళ్లంబున్ | కళ్లంబులన్ |
| తృ. | కళ్లముచేతన్ మొ. | కళ్లములచేతన్ మొ. |

శేషంబు జ్ఞానశబ్దంబునకు వలె.

ఇట్లు అందము, చందము, గొల్లము, పల్లము మొ.

## అమహత్వర్థకములు.

### మేఁక శబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | మేఁక | (ఛాగి) | మేఁకలు |

(TELUGU NOUNS.)

## అమహదర్థకములు.

| | ఏ. | బ. |
|---|---|---|
| ద్వి. | మేఁకను | మేఁకలను |
| తృ. | మేఁకచేతను మొ. | మేఁకలచేతను మొ. |

శేషం బూహ్యంబు.

ఇట్లు నేల మొ.

## లేడి శబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | లేడి | (ఆఁడుజింక) | లేడులు, లేళ్లు |
| ద్వి. | లేడిని | | లేడులను, లేళ్లను |
| తృ. | లేడిచేతను మొ. | | లేడులచేతను, లేళ్లచేతను మొ. |

శేషం బూహ్యంబు.

## ఎనుము శబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | ఎనుము | (బఱ్ఱె) | ఎనుములు |
| ద్వి. | ఎనుమును | | ఎనుములను |
| తృ. | ఎనుముచేతను మొ. | | ఎనుములచేతను మొ. |

శేషం బూహ్యంబు.

## గేదె శబ్దము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర | గేదె | (బఱ్ఱె) | గేదెలు. |
| ద్వి. | గేదెను | | గేదెలను |
| తృ. | గేదెచేతను మొ. | | గేదెలచేతను మొ. |

శేషం బూహ్యంబు.

ఇటు బఱ్ఱె మొ.

---

(TELUGU NOUNS.)

## ఔపవిభక్తికాంతములు.

తెనుఁగునామములు కొన్నిటిమీఁద విభక్తులు పరమగునపుడు ఇ, టి, తి అనువర్ణములు ద్వితీయాద్యేకవచనములందు వచ్చును. అవి ఔపవిభక్తికము లనఁబడును. అట్టి ఔపవిభక్తికములు అంతమునందుఁ గల నామములు ఔపవిభక్తికాంతములు. అవి అవర్ణముల క్రమముగా నీ క్రిందఁ గొన్ని వ్రాయఁబడుచున్నవి.

### మహత్త్వార్థకము.

### ఆ లు శ బ్ద ము.

| | ఏ. | బ. |
|---|---|---|
| ప్ర. | అలు (భార్య) | అండ్రు |
| ద్వి. | అలిన్ | అండ్రన్ |
| తృ. | అలిచేతన్, అలిచేన్<br>అలితోడన్, అలితోన్ | అండ్రచేతన్, అండ్రచేన్<br>అండ్రతోడన్, అండ్రతోన్ |
| చ. | అలికొఱకున్, అలికయి | అండ్రకొఱకున్, అండ్రకయి |
| పం. | అలివలనన్, అలికంటెన్ | అండ్రవలనన్, అండ్రకంటెన్ |
| ష. | అలికిన్, అలియొక్క | అండ్రకున్, అండ్రయొక్క<br>అండ్రలోపలన్ |
| స. | అలియందున్ | అండ్రయందున్, అండ్రందున్ |
| సం. | ఓఅల, ఓఅలా | ఓఅండ్రార, ఓఅండ్రారా<br>ఓఅండ్రు. |

ఇటు ఏరాలు, కొమరాలు, జవరాలు, ముద్దరాలు మొ.

(TELUGU NOUNS.)

## ఔపవిభక్తికాంతములు.

## అమహదర్థకములు.

### త్రాడు శబ్దము.

| | ఏ. | బ. |
|---|---|---|
| ప్ర. | త్రాడు (దారము) | త్రాడులు, త్రాళులు, త్రాళ్లు |
| ద్వి. | త్రాటిన్ | త్రాడులన్, త్రాళులన్, త్రాళ్లన్ |
| తృ. | త్రాటన్ | |
| | త్రాటిచేతన్ | త్రాడులచేతన్ |
| | | త్రాళులచేతన్, త్రాళ్లచేతన్ |
| | త్రాటిచేన్ | త్రాడులచేన్ |
| | | త్రాళులచేన్, త్రాళ్లచేన్ |
| | త్రాటితోడన్ | త్రాడులతోడన్ |
| | | త్రాళులతోడన్, త్రాళ్లతోడన్ |
| | త్రాటితోన్ | త్రాడులతోన్ |
| | | త్రాళులతోన్, త్రాళ్లతోన్ |
| చ. | త్రాటికొఱకున్ | త్రాడులకొఱకున్ |
| | | త్రాళులకొఱకున్, త్రాళ్లకొఱకున్ |
| | త్రాటికయి | త్రాడులకయి |
| | | త్రాళులకయి, త్రాళ్లకయి |
| పం. | త్రాటివలనన్ | త్రాడులవలనన్ |
| | | త్రాళులవలనన్, త్రాళ్లవలనన్ |
| | త్రాటికంటెన్ | త్రాడులకంటెన్ |
| | | త్రాళులకంటెన్, త్రాళ్లకంటెన్ |
| | త్రాటికిన్ | త్రాడులకున్, త్రాళులకున్, త్రాళ్లకున్ |

(Telugu Nouns.)

## ఔపవిభక్తికాంతములు.

### అమహదర్థకములు.

| | ఏ. | బ. |
|---|---|---|
| | త్రాటియొక్క | త్రాడులయొక్క |
| | | త్రాళులయొక్క, త్రాళ్లయొక్క |
| | | త్రాడులలోపలఁ |
| | | త్రాళులలోపలఁ, త్రాళ్లలోపలఁ |
| స. | త్రాటఁ | |
| | త్రాటియందుఁ | త్రాడులయందుఁ, త్రాడులందుఁ |
| | | త్రాళులయందుఁ, త్రాళులందుఁ |
| | | త్రాళ్లయందుఁ, త్రాళ్లందుఁ |
| సం. | ఓత్రాడ | ఓత్రాడులార, ఓత్రాడులారా |
| | ఓత్రాడా | ఓత్రాళులార, ఓత్రాళులారా |
| | | ఓత్రాళ్లార, ఓత్రాళ్లారా |
| | | ఓత్రాడులు, ఓత్రాళులు, ఓత్రాళ్లు. |

ఇట్లు కాఁడు, పీఁడు మొ.

### కన్ను శబ్దము.

| | ఏ. | బ. |
|---|---|---|
| ప్ర. | కన్ను (నేత్రము) | కన్నులు |
| ద్వి. | కంటిని | కన్నులను |
| తృ. | కంటఁ | |
| | కంటిచేతను, కంటిచేఁ | కన్నులచేతను, కన్నులచేఁ |
| | కంటితోడను, కంటితోఁ | కన్నులతోడను, కన్నులతోఁ |

(Telugu Nouns.)

## ఔపవిభక్తికాంతములు.

### అనుపాదర్థకములు.

| ఏ. | | బ. |
|---|---|---|
| చ. | కంటికొఱకు, కంటికయి | కన్నులకొఱకు, కన్నులకయి |
| పం. | కంటివలనన్, కంటికంటెన్ | కన్నులవలనన్, కన్నులకంటెన్ |
| ష. | కంటికిన్, కంటియొక్క | కన్నులకున్, కన్నులయొక్క |
| | | కన్నులలోపలన్ |
| స. | కంటన్, కంటియందున్ | కన్నులయందున్, కన్నులందున్ |
| సం. | ఓకన్నా, ఓకన్నా | ఓకన్నులార, ఓకన్నులారా |
| | | ఓకన్నులు. |

ఇట్లు మన్ను, మిన్ను మొ.

### పల్లుశబ్దము.

| ఏ. | | బ. |
|---|---|---|
| ప్ర. | పల్లు (దంతము) | పల్లులు, పండులు, పండ్లు |
| ద్వి. | పంటిన్ | పల్లులన్, పండులన్, పండ్లన్ |
| తృ. | పంటన్ | |
| | పంటిచేతన్ | పల్లులచేతన్ |
| | | పండులచేతన్, పండ్లచేతన్ |
| | పంటిచేన్ | పల్లులచేన్ |
| | | పండులచేన్, పండ్లచేన్ |
| | పంటితోడన్ | పల్లులతోడన్ |
| | | పండులతోడన్, పండ్లతోడన్ |

(TELUGU NOUNS.)

## ఔపవిభక్తికాంతములు.

### అమహదర్థకములు.

| | ఏ. | బ. |
|---|---|---|
| | పంటితోఁ | పల్లులతోఁ<br>పండులతోఁ, పండ్లతోఁ |
| చ. | పంటికొఱకుఁ | పల్లులకొఱకుఁ<br>పండులకొఱకుఁ, పండ్లకొఱకుఁ |
| | పంటికయి | పల్లులకయి<br>పండులకయి, పండ్లకయి |
| పం. | పంటివలనఁ | పల్లులవలనఁ<br>పండులవలనఁ, పండ్లవలనఁ |
| | పంటికంటెఁ | పల్లులకంటెఁ<br>పండులకంటెఁ, పండ్లకంటెఁ |
| ష. | పంటికిఁ | పల్లులకుఁ<br>పండులకుఁ, పండ్లకుఁ |
| | పంటియొక్క | పల్లులయొక్క<br>పండులయొక్క, పండ్లయొక్క<br>పల్లులలోపలఁ<br>పండులలోపలఁ, పండ్లలోపలఁ |
| స. | పంటఁ | |
| | పంటియందుఁ | పల్లులయందుఁ, పల్లులందుఁ<br>పండులయందుఁ, పండులందుఁ<br>పండ్లయందుఁ, పండ్లందుఁ |

(TELUGU NOUNS.)

## ఔపవిభక్తికాంతములు,

## అనుహాదర్థకములు.

| | ఏ. | బ. |
|---|---|---|
| సం. | ఓపల్ల, ఓపల్లా | ఓపల్లులార, ఓపల్లులారా<br>ఓపండులార, ఓపండులారా<br>ఓపండ్లార, ఓపండ్లారా<br>ఓపల్లులు, ఓపండులు, ఓపండ్లు. |

ఇటు ఇల్లు, కల్లు (కాయి) ముల్లు, విల్లు మొ.

## చే యి శ బ్ద ము.

| | ఏ. | బ. |
|---|---|---|
| ప్ర. | చేయి (హస్తము) | చేతులు |
| ద్వి. | చేతిన్ | చేతులన్ |
| తృ. | చేతన్, చేతిచేతన్ మొ. | చేతులచేతన్ మొ. |
| ష. | చేతికిన్, చేతియొక్క | చేతులకున్, చేతులయొక్క<br>చేతులలోపలన్ |
| స. | చేతన్, చేతియందున్ | చేతులయందున్, చేతులందున్. |

శేషం బూహ్యంబు.

ఇటు నూయి, నేయి, వాయి మొ.

---

(TELUGU PRONOUNS.)

పురుషాద్యర్థకములయిన యెల్ల నామంబులకును మాఱుగా నుపయోగింపఁబడునట్టి అన్ని మొదలగు నామములు సర్వనామము లనఁబడును. వాని రూపము లీ దిగువ వరుసగా వ్రాయఁబడియెడి.

సంస్కృతమునందలి సర్వనామములందును అజంతశబ్దముల రూపములు నామశబ్దముల కొనను వాని వంటివిగాన వాని యిక్కడ వేఱుగాఁ దెలుపఁబడవయ్యెను. త్వదాదులగు హలంతశబ్దములో యిందుఁ బ్రత్యేకముగాఁ బ్రయోగింపఁబడవు.

## ఆశబ్దము తదర్థకము.

### మహదర్థకము.

| | ఏ. | బ. |
|---|---|---|
| ప్ర. | వాఁడు (ఆ పురుషుఁడు) | వారు, వారలు, వాండ్రు |
| ద్వి. | వానిన్ | వారిన్, వారలన్, వాండ్రన్ |
| తృ. | వానిచేతన్ | వారిచేతన్, వారలచేతన్, వాండ్రచేతన్ |
| | వానిచేన్ | వారిచేన్, వారలచేన్, వాండ్రచేన్ |
| | వానితోడన్ | వారితోడన్, వారలతోడన్, వాండ్రతోడన్ |
| | వానితోన్ | వారితోన్, వారలతోన్, వాండ్రతోన్ |
| చ. | వానికొఱకున్ | వారికొఱకున్, వారలకొఱకున్, వాండ్రకొఱకున్ |

(TELUGU PRONOUNS.)

## మహదర్థకము.

| ఏ. | బ. |
|---|---|
| వానికయి | వారికయి, వారలకయి<br>వాండ్రకయి |
| పం. వానివలనన్ | వారివలనన్, వారలవలనన్<br>వాండ్రవలనన్ |
| వానికంటెన్ | వారికంటెన్, వారలకంటెన్<br>వాండ్రకంటెన్ |
| ష. వానికిన్ | వారికిన్, వారలకున్<br>వాండ్రకున్ |
| వానియొక్క | వారియొక్క, వారలయొక్క<br>వాండ్రయొక్క |
| | వారిలోపలన్, వారలలోపలన్<br>వాండ్రలోపలన్ |
| స. వానియందున్ | వారియందున్<br>వారలయందున్, వారలందున్<br>వాండ్రయందున్, వాండ్రందున్ |

ఇందు తదాది సర్వనామంబులకు సంబోధనంబు లేదు.

## మహత్వర్థకము.

| ఏ. | బ. |
|---|---|
| ప్ర. అది, అద్ది (అస్త్రీ)<br>అయది, అయ్యది | వారు, వారలు, వాండ్రు |
| ద్వి. దానిన్, ఆదానిన్, అద్దానిన్ | వారిన్, వారలన్, వాండ్రన్ |

(Telugu Pronouns.)

### మహత్త్వార్థకము.

| | ఏ. | బ. |
|---|---|---|
| తృ. | దానిచేతఁ జె. | వారిచేతఁ జె. |
| స. | దానియందుఁ జె. | వారియందుఁ జె. |

శేషం బూహ్యంబు.

### అమహదమహత్త్వార్థకము.

| | ఏ. | బ. |
|---|---|---|
| ప్ర. | అది, అద్ది (అపశ్వ్యాదికము) | అవి, అవ్వి |
| | అయది, అయ్యది | అయవి, అయ్యవి |
| ద్వి. | దానిఁ, అదానిఁ, అద్దానిఁ | వానిఁ |
| తృ. | దానఁ | వానఁ |
| | దానిచేతఁ, అదానిచేతఁ, అద్దానిచేతఁ | వానిచేతఁ |
| | దానిచేఁ, అదానిచేఁ, అద్దానిచేఁ | వానిచేఁ |
| | దానితోడఁ | |
| | అదానితోడఁ, అద్దానితోడఁ | వానితోడఁ |
| | దానితోఁ, అదానితోఁ, అద్దానితోఁ | వానితోఁ |
| చ. | దానికొఱకుఁ | వానికొఱకుఁ |
| | అదానికొఱకుఁ, అద్దానికొఱకుఁ | |
| | దానికయి, అదానికయి, అద్దానికయి | వానికయి |
| పం. | దానివలనఁ | |
| | అదానివలనఁ, అద్దానివలనఁ | వానివలనఁ |
| | దానికంటెఁ | వానికంటెఁ |
| | అదానికంటెఁ, అద్దానికంటెఁ | |

# తెనుఁగు సర్వనామములు.

(TELUGU PRONOUNS.)

## అమహదమహత్యర్థకము.

| | ఏ. | బ. |
|---|---|---|
| ష. | దానికిన్, ఆదానికిన్, అద్దానికిన్ | వానికిన్ |
| | దానియొక్క | |
| | ఆదానియొక్క, అద్దానియొక్క | వానియొక్క |
| | | వానిలోపలన్ |
| స. | దానన్, ఆదానన్, అద్దానన్ | వానన్ |
| | దానియందున్ | |
| | ఆదానియందున్, అద్దానియందున్ | వానియందున్ |

## ఈశబ్దము ఇదమర్థకము.

### మహదర్థకము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | వీఁడు | (ఈపురుషుఁడు) | వీరు, వీరలు, వీండ్రు |
| ద్వి. | వీనిన్ | | వీరిన్, వీరలన్, వీండ్రన్ |
| తృ. | వీనిచేతన్ మొ. | | వీరిచేతన్ మొ. |

శేషం బాశబ్దంబునకు వలె.

### మహత్యర్థకము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | ఇది, ఇద్ది | (ఈస్త్రీ) | వీరు, వీరలు, వీండ్రు |
| | ఈయది, ఇయ్యది | | |
| ద్వి. | దీనిన్, ఈదానిన్, ఇద్దానిన్ | | వీరిన్, వీరలన్, వీండ్రన్ |
| తృ. | దీనిచేతన్ | | వీరిచేతన్, వీరలచేతన్ |
| | ఈదానిచేతన్, ఇద్దానిచేతన్ మొ. | | వీండ్రచేతన్ మొ. |

శేషం బాశబ్దంబునకు వలె.

(TELUGU PRONOUNS.)

## అమహదమహత్త్వర్థకము.

| | ఏ. | | బ. |
|---|---|---|---|
| ప్ర. | ఇది, ఇద్ది | (ఈపశ్వాదికము) | ఇవి, ఇవ్వి |
| | ఈయది, ఇయ్యది | | ఈయవి, ఇయ్యవి |
| ద్వి. | దీనిన్, ఈదానిన్, ఇద్దానిన్ | | వీనిన్ |
| తృ. | దీనన్ | | వీనన్ |
| | దీనిచేతన్ | | |
| | ఈదానిచేతన్, ఇద్దానిచేతన్ మొ. | | వీనిచేతన్ మొ. |

శేషం బూహ్యంబు.

## ఏశబ్దము యత్కిమర్థకము.

### మహదర్థకము.

| | ఏ. | బ. |
|---|---|---|
| ప్ర. | ఏఁడు | ఏరు |
| | ఏవాఁడు | ఏవారు, ఏవారలు, ఏవాండ్రు |
| | ఎవ్వాఁడు | ఎవ్వారు, ఎవ్వారలు, ఎవ్వాండ్రు |
| | ఎవ్వఁడు | ఎవ్వరు, ఎవ్వండ్రు |
| | ఎవఁడు | ఎవరు, ఎవండ్రు |
| ద్వి. | ఏనిన్ | ఏరిన్ |
| | ఏవానిన్ | ఏవారిన్, ఏవారలన్, ఏవాండ్రన్ |
| | ఎవ్వానిన్ | ఎవ్వారిన్, ఎవ్వారలన్, ఎవ్వాండ్రన్ |
| | ఎవ్వనిన్ | ఎవ్వరిన్, ఎవ్వండ్రన్ |
| | ఎవనిన్ | ఎవరిన్, ఎవండ్రన్ |

(TELUGU PRONOUNS.)

మహదర్థకము.

| | ఏ. | బ. |
|---|---|---|
| తృ. | ఏనిచేతఁ | ఏరిచేతఁ |
| | ఏవానిచేతఁ | ఏవారిచేతఁ |
| | ఎవ్వానిచేతఁ | ఎవ్వారిచేతఁ |
| | ఎవ్వనిచేతఁ | ఎవ్వరిచేతఁ |
| | ఎవనిచేతఁ వెం. | ఎవరిచేతఁ వెం. |
| చ. | ఏనికొఱకుఁ | ఏరికొఱకుఁ |
| | ఏవానికొఱకుఁ | ఏవారికొఱకుఁ |
| | ఎవ్వానికొఱకుఁ | ఎవ్వారికొఱకుఁ |
| | ఎవ్వనికొఱకుఁ | ఎవ్వరికొఱకుఁ |
| | ఎవనికొఱకుఁ వెం. | ఎవరికొఱకుఁ వెం. |
| పం. | ఏనివలనఁ | ఏరివలనఁ |
| | ఏవానివలనఁ | ఏవారివలనఁ |
| | ఎవ్వానివలనఁ | ఎవ్వారివలనఁ |
| | ఎవ్వనివలనఁ | ఎవ్వరివలనఁ |
| | ఎవనివలనఁ వెం. | ఎవరివలనఁ వెం. |
| ష. | ఏనికిఁ | ఏరికిఁ |
| | ఏవానికిఁ | ఏవారికిఁ |
| | ఎవ్వానికిఁ | ఎవ్వారికిఁ |
| | ఎవ్వనికిఁ | ఎవ్వరికిఁ |
| | ఎవనికిఁ వెం. | ఎవరికిఁ వెం. |
| స. | ఏనియందుఁ | ఏరియందుఁ |
| | ఏవానియందుఁ | ఏవారియందుఁ |

## తెనుఁగు సర్వనామములు.

(TELUGU PRONOUNS.)

### మహాదర్థకము.

| ఏ. | బ. |
|---|---|
| ఎవ్వానియందున్ | ఎవ్వారియందున్ |
| ఎవ్వనియందున్ | ఎవ్వరియందున్ |
| ఎవనియందున్ మొ. | ఎవరియందున్ మొ. |

శేషం బూహ్యంబు.

### మహత్యర్థకము.

| | ఏ. | బ. |
|---|---|---|
| *ప్ర. | ఎవతె (ఏస్త్రీ) | ఏరు, ఏవారు, ఏవారలు, ఏవాండ్రు |
| ద్వి. | ఎవతెన్ | ఏవారిన్ మొ. |
| తృ. | ఎవతెచేతన్, ఎవతెచేన్ | ఏరిచేతన్, ఏరిచేన్ |
| | ఎవతెతోడన్, ఎవతెతోన్ | ఏరితోడన్, ఏరితోన్ మొ. |
| చ. | ఎవతెకొఱకున్, ఎవతెకయి | ఏరికొఱకున్, ఏరికయి మొ. |
| పం. | ఎవతెవలనన్ | ఏరివలనన్ |
| | ఎవతెకంటెన్ | ఏరికంటెన్ మొ. |
| ష. | ఎవతెకున్, ఎవతెయొక్క | ఏరికిన్, ఏరియొక్క |
| | | ఏరిలోపలన్ మొ. |
| స. | ఎవతెయందున్ | ఏరియందున్ మొ. |

శేషం బూహ్యంబు.

---

*దీనికి రూపాంతరంబు లనేకంబులు గలవు. వానినెల్ల బాలవ్యాకరణమువలనఁ దెలిసికొనవలయును.

# తెనుఁగు సర్వనామములు.

(TELUGU PRONOUNS.)

## అమహదమహాత్వర్థకము.

| ఏ. | | బ. |
|---|---|---|
| ప్ర. ఎది, ఎద్ది | (ఏపళ్యాదికము) | ఎవి, ఎవ్వి |
| ఏయది, ఎయ్యది | | ఏయవి, ఎయ్యవి |
| ద్వి. దేనిన్, ఏదానిన్, ఎద్దానిన్ | | వేనిన్ |
| తృ. దేనన్ | | వేనన్ |
| దేనిచేతన్ | | |
| ఏదానిచేతన్, ఎద్దానిచేతన్ మొ. | | వేనిచేతన్ మొ. |

శేషం బూహ్యంబు.

ఈ దిగువ వ్రాయఁబడు నీ మొదలగు సాల్గుశబ్దములు మహదాద్యర్థము లన్నింటియందును సమానరూపములు గలవియగును.

## నీశబ్దము యుష్మదర్థకము.

| ఏ. | బ. |
|---|---|
| ప్ర. నీవు, ఈవు | మీరు, ఈరు, మీరలు, ఈరలు |
| ద్వి. నిన్నున్, నినున్ | మిమ్మున్, మిమున్ |
| తృ. నీచేతన్, నీచేన్ | మీచేతన్, మీచేన్ |
| నీతోడన్, నీతోన్ | మీతోడన్, మీతోన్ |
| చ. నీకొఱకున్, నీకయి | మీకొఱకున్, మీకయి |
| పం. నీవలనన్, నీకంటెన్ | మీవలనన్, మీకంటెన్ |
| ష. నీకున్, నీయొక్క | మీకున్, మీయొక్క, మీలోపలన్ |
| స. నీయందున్ | మీయందున్. |

(TELUGU PRONOUNS.)

## అమహాదమహత్త్వర్థకము.

### నాశబ్దము అస్మదర్థకము.

| | ఏ. | బ. |
|---|---|---|
| ప్ర. | నేను, ఏను | మేము, ఏము |
| ద్వి. | నన్నుఁ, ననుఁ | మమ్ముఁ, మముఁ |
| తృ. | నాచేతఁ, నాచేఁ | మాచేతఁ, మాచేఁ |
| | నాతోడఁ, నాతోఁ | మాతోడఁ, మాతోఁ |
| చ. | నాకొఱకుఁ, నాకయి | మాకొఱకుఁ, మాకయి |
| పం. | నావలనఁ, నాకంటెఁ | మావలనఁ, మాకంటెఁ |
| ష. | నాకుఁ, నాయొక్క | మాకుఁ, మాయొక్క |
| | | మాలోపలఁ |
| స. | నాయందుఁ | మాయందుఁ. |

### మనశబ్దము యుష్మదస్మదర్థకము.

నిత్య బహువచనాంతము.

ప్ర. మనము

ద్వి. మనలఁ

తృ. మనచేతఁ, మనచేఁ మొ.

### తాశబ్దము ఆత్మార్థకము.

| | ఏ. | బ. |
|---|---|---|
| ప్ర. | తాను | తాము, తారు, తమరు |
| ద్వి. | తన్నుఁ, తనుఁ | తమ్ముఁ, తముఁ |
| తృ. | తనచేతఁ, తనచేఁ మొ. | తమచేతఁ, తమచేఁ మొ. |

శేషం బూహ్యంబు.

నామము లట్లే క్రియలును సంస్కృతసమములు అచ్చతెనుఁగు అని రెండు విధములగును. ఆ క్రియలు అకర్మకములు సకర్మకములని ద్వివిధములు. అకర్మకము లనఁగా కర్మపదము లేనివి. కర్మపదములను గోరనివనుట. సకర్మకము లనఁగా కర్మపదము గలవి. కర్మపదములను గోరునవి యనుట. సకర్మక క్రియలకే కర్తరర్థమును సాధారణముగా ఆత్మనేపదార్థమును గలవు గాని అకర్మకక్రియలకు లేవు. అకర్మకక్రియలకు ప్రేరణమునందు అవి గలవి. ఈ క్రియలు తద్ధర్మము, వర్తమానము, భూతము, భవిష్యత్తు, ప్రార్థనము, వ్యతిరేకము అను నీయర్థములు గలవియయి వ్యవహరింపఁబడును. తద్ధర్మ మనఁగా ధాతువుయొక్క వ్యాపారము. దీనిచే తాచ్ఛీల్యాద్యర్థములును గ్రహింపఁబడుచున్నవి. తద్ధర్మార్థక క్రియ యొక్కొకచో వర్తమాన భూత భవిష్యదర్థములను సహితము దెలుపును. వర్తమాన మనఁగా జరుగుచుండుకాలము. భూత మనఁగా కడచినకాలము. భవిష్యత్తనఁగా రాఁబోవుకాలము. ప్రార్థనము అనఁగా వేఁడుట. ఇది విధ్యర్థమునకును ఉపలక్షణము. వ్యతిరేకము అనఁగా విరోధము. ఈ క్రియలకు అశబ్దములోనగు నామములు కర్తలగునపుడు ప్రథమ పురుషము అనియు, నీశబ్దము కర్తయగునపుడు మధ్యమ పురుషము అనియు, నాశబ్దము కర్తయగునపుడు ఉత్తమ పురుషము అనియు సంజ్ఞలు గలవు. వ్యవహారదశయందు, సంస్కృత సమక్రియల కన్నింటికిఁ దఱచుగా స్వార్థమందును ప్రేరణమందును, తెనుఁగు క్రియల కన్నింటికిఁ దఱచుగా ప్రేరణమందును గొన్నింటికి మాత్రము స్వార్థమందును కడపట ఇంచు అను ఆగమంబు వచ్చును. ఉభయవిధము అయిన అకర్మక క్రియలకుఁ గొన్నింటికి స్వార్థమున ఇల్లు అను నాగమంబు వచ్చును.

# సంస్కృతసమక్రియలు.

(SANSKRIT VERBS.)

ధాతువు (ROOT) ప్రకాశించు.

అకర్మకము, INTRANSITIVE.

కర్త్రర్థకము, ACTIVE VOICE.

*సమాపకములు, FINITE VERBS.

తద్ధర్మార్థకము, THE AORIST INDEFINITE TENSE.

ప్రథమపురుషము, THIRD PERSON.

| ఏ. | బ. |
| --- | --- |
| ప్రకాశించును (వెలుఁగును) | ప్రకాశింతురు, ప్రకాశింత్రు; ప్రకాశింపుదురు, ప్రకాశించును. |

మధ్యమపురుషము, SECOND PERSON.

| | |
| --- | --- |
| ప్రకాశింతువు, ప్రకాశింతు | ప్రకాశింతురు, ప్రకాశింత్రు ప్రకాశింపుదురు. |

ఉత్తమపురుషము, FIRST PERSON.

| | |
| --- | --- |
| ప్రకాశింతును | ప్రకాశింతుము |
| ప్రకాశింపుదును | ప్రకాశింపుదుము. |

తద్ధర్మార్థకరూపాంతరము.

ANOTHER FORM OF AORIST INDEFINITE TENSE.

| | | |
| --- | --- | --- |
| ప్ర. | ప్రకాశించెడిఁ | ప్రకాశించెదరు |
| | ప్రకాశించెడుఁ | ప్రకాశించెడిఁ |
| | | ప్రకాశించెడుఁ |
| మ. | ప్రకాశించెదవు, ప్రకాశించెదు | ప్రకాశించెదరు |
| ఉ. | ప్రకాశించెదను | ప్రకాశించెదము. |

*సమాపకము అనఁగా ముగిసిన క్రియలు.

(SANSKRIT VERBS.)

వర్తమానార్థకము, PRESENT TENSE.

| | ఏ. | బ. |
|---|---|---|
| ప్ర. | ప్రకాశించుచున్నాఁడు | ప్రకాశించుచున్నారు |
| | ప్రకాశించుచున్నది | ప్రకాశించుచున్నవి |
| మ. | ప్రకాశించుచున్నావు | ప్రకాశించుచున్నారు |
| ఉ. | ప్రకాశించుచున్నాను | ప్రకాశించుచున్నాము. |

భూతార్థకము, PAST TENSE.

| | | |
|---|---|---|
| ప్ర. | ప్రకాశించెను | ప్రకాశించిరి, ప్రకాశించెను |
| మ. | ప్రకాశించితివి, ప్రకాశించితి | ప్రకాశించితిరి |
| ఉ. | ప్రకాశించితిని | ప్రకాశించితిమి. |

భవిష్యదర్థకము, FUTURE TENSE.

| | | |
|---|---|---|
| ప్ర. | ప్రకాశింపఁగలఁడు | ప్రకాశింపఁగలరు |
| | ప్రకాశింపఁగలదు | ప్రకాశింపఁగలవు |
| మ. | ప్రకాశింపఁగలవు | ప్రకాశింపఁగలరు |
| ఉ. | ప్రకాశింపఁగలను | ప్రకాశింపఁగలము. |

ప్రార్థనాద్యర్థకము, IMPERATIVE MOOD.

| | | |
|---|---|---|
| *మ. | ప్రకాశింపుము | ప్రకాశింపుఁడు. |

ఉభయకర్తృకార్థక ప్రార్థనాద్యర్థకము.

ఉ. బ. ప్రకాశింతము, ప్రకాశింపుదము.

*వీనికి ప్రకాశింపుమ, ప్రకాశింపుమా, ప్రకాశింపుమి, ప్రకాశింపుమీ, ప్రకాశింపుఁడ, ప్రకాశింపుఁడా, ప్రకాశింపుఁడి, ప్రకాశింపుఁడీ అని రూపాంతరములు. ఇట్లంతట నెఱుంగవలెను.

(SANSKRIT VERBS.)

## ఆశీరర్థకము, OPTATIVE MOOD.

ప్రకాశించుతఁ.

(ఇది అవ్యయము. ఇట్లంతట నెఱుంగవలయును.)

## వ్యతిరేకార్థకము, NEGATIVE FORM.

| | ఏ. | బ. |
|---|---|---|
| ప్ర. | ప్రకాశింపఁడు | ప్రకాశింపరు |
| | ప్రకాశింపదు | ప్రకాశింపరు, ప్రకాశింపవు |
| *మ. | ప్రకాశింపవు | ప్రకాశింపరు |
| ఉ. | ప్రకాశింపను | ప్రకాశింపము. |

## వ్యతిరేకప్రార్థనాద్యర్థకము, NEGATIVE IMPERATIVE.

| | | |
|---|---|---|
| మ. | ప్రకాశింపకుము | ప్రకాశింపకుఁడు. |

## అసమాపకములు, INFINITE VERBS.

అసమాపకము అనఁగా ముగియని క్రియలు. ఇవి క్రియాకాంక్షములు, నామాకాంక్షము అని ద్వివిధములు. క్రియాకాంక్షము అనఁగా క్రియను గోరునట్టివి. నామాకాంక్షము అనఁగా నామమును గోరునట్టివి.

## క్రియాకాంక్షాసమాపకములు, PARTICIPLES.

| | | |
|---|---|---|
| భూతార్థకాసమాపకము | Past Participle | ప్రకాశించి |
| వ్యతిరేకభూతార్థకాసమాపకము | Past Participle (Negative) | ప్రకాశింపక |

*వీనిమీఁద అయ్యా, అమ్మ లోనగునవి వచ్చునపుడు అవి ప్రార్థనార్థకములగును. ఉదా. ప్రకాశింపవయ్యా, ప్రకాశింపవమ్మ, ప్రకాశింపరయ్యా, ప్రకాశింపరమ్మ ఇత్యాదులు. ఇట్లంతటను నెఱుంగవలయును.

(SANSKRIT VERBS.)

| | | |
|---|---|---|
| తాదర్థ్యార్థకా సమాపకము | Infinitive Mood | ప్రకాశింపఁ |
| వర్తమానార్థకా సమాపకము | Present Participle | ప్రకాశించుచుఁ |
| అనంతర్యార్థకా సమాపకము | Subjunctive Mood | ప్రకాశించుడుఁ |
| పశ్చాంతరార్థకా సమాపకము | Conditional Mood | ప్రకాశించినఁ. |

ఇవి అర్థమునుబట్టి యేర్పఱచిన సంజ్ఞలు. ఇటు కాని పక్షమందు భూతార్థకా సమాపకము అనునది మొదలుగాఁగలవానికి క్రమముగా ఇప్రత్యయాంతాసమాపకము, అక ప్రత్యయాంతాసమాపకము, అప్రత్యయాంతాసమాపకము, చుప్రత్యయాంతాసమాపకము, డుప్రత్యయాంతాసమాపకము, ఇనప్రత్యయాంతాసమాపకము అనియుఁ బ్రత్యయములను గొని పేరిడవచ్చును. క్త్వాప్రత్యయాంతాది సంజ్ఞలు సంస్కృతమునందలివి యిట్లే యేర్పడియున్నవి.

నామాకాంక్షాసమాపకములు.

PARTICIPIAL ADJECTIVES AORIST FORM.

| | | |
|---|---|---|
| తద్ధర్మార్థక విశేషణము | Relative Participle | ప్రకాశించు, ప్రకాశించెడి, ప్రకాశించెడు |
| వర్తమానార్థక విశేషణము | Relative Participle (Present form) | ప్రకాశించుచున్న |
| భూతార్థక విశేషణము | Relative Participle (Past form) | ప్రకాశించిన |

